శ్రీరస్తు.



శ్రీగురువేనమః

ముండూరు॥ వీరయ్యయోగిచే

రచియింపబడిన

# పరబ్రహ్మానందబోధము.



పసల॥ పార్థసారథినాయనివారి

స్వకీయ

విద్వన్మోదతరంగిణీ

ముద్రాక్షరశాలయందుముద్రింపబడియె.



౧౮౮౩ వ సంవత్సరము.



శ్రీరస్తు.

శ్రీవిశ్వనాథపరబ్రహ్మణేనమః.



## శ్రీపరబ్రహ్మానందబోధమనుమహాప్రబంధంబునందు

## ప్రథమాశ్వాసప్రారంభము.



శ్రీగురులింగమూర్తినిభజించిగణాస్యదలంచిభక్తిచే
బాగుగసప్తసిద్ధులనుభానునిజంద్రునిదేవసంతతిన్। యోగు
లనెల్లవేఁడియుపయోగపదంబులమీరునట్టియా। యోగ
వశాస్త్రమున్ ధరణినద్భుతమొందఁగఁజెప్పఁబూనితిన్॥ ౧

మ॥ వితతంబై సభవద్విలాస్యకరుణన్ వీక్షించిపాలిం
చుమీ। శ్రితయోగీశ్వరసురేంద్రచంద్రవిబుధుల్ చిత్తంబు
లన్నిల్పుచున్। సతతంబున్ నినుఁగొల్చికీర్తిపరులై సా
ధ్యోన్నతుల్ జెందిరా। ధృతగంగాజటమేరుచాపగిరిజా
దేవీశయీశాధవా॥ ౨

మ॥ గజచర్మాంబరధారివై భవుఁడవై గాంభీర్యధు
ర్యుండవై। నిజభక్తాళిమనోరథప్రదుఁడవై నిత్యుండవై
సాక్షివై। భుజగాధీశవిశేషభూషణుఁడవై భూరిప్రభా
పుంజవై। భజరామాద్వయపాతకుండవగునిన్ భక్తిన్
గడఁగ్రొమ్మొక్కెదన్॥ 3

శరీతత్వంబులే దేహంబకొక్క యించుకంశకుండె దేహాపర
బ్రహ్మమదొక్క- మరియునందుస్థూలసూక్ష్మ కారణంబులని
మూడుదేహంబు లేర్పడి యందు విశ్వతైజసప్రాజ్ఞులనిబే
ధ్రితిభావంబు నొంది పంచావస్థలకెంది యష్టాంగంబులు
దాల్పియందు- రాజస- తామస- సాత్విక- గుణంబు
లమరి మనోబుద్ధి చిత్తాహంకారంబులను నంతఃకరణ
చతుష్టయంబులబ్రావుగొని- కామక్రోధలోభ మోహామ
దమాత్సర్యంబులను నరిషడ్వరంబులమీరిభోగభాగ్యవం
పదలు గోరిపుణ్యపాపంబులు సేయుచు జీణభోగంబుల
ననుభవించుచు కష్టసుఖంబులబొందుచు సర్వకామానిద్వా
రంబులంబుట్టుచు స్త్రీలుపురుషులను భావంబునబ్రమి
బ్రకళబ్రామలగాటకు నెడతేనిమఃఖంబులనుభవించుచుజ
చ్చిపుట్టుచునుందు రెట్లన్నను॥ ౪౨

ఉ॥ అన్నమయంబుచేత మరియాత్మ సుఖంబునుజీ
వులందుఁగా। వన్నెదెలంగుశోణితమువర్తనశుక్లసమిశ్రి
తంబునఁగా। గన్నవకామవృద్ధిగనఁగా విషయాదులయం
దుసక్తిఁదై। సన్నగఁగోరబ్రజనసంపదవృద్ధియుఁ బొం
దుఁలోకముఁగా॥ ౪౩

క॥ తరుణులుబుకడకునుబోయిన। వరమగుమరియుకుపు
కాలవరతానదొకటిఁగా। దరదినరతుబెడపుష్పము। విరివిగ
విగసింపనతఁపుటితమొకటిఁశరఁగా॥ ౪౪

సీ॥ మదతులలకుపుఁటుక్లపక్షమనందు కాద్యమం
గుష్టంబుబట్టియుండు। విదియపాదములందు వెనదడియు
సుగుత్తునమరుచాటినితొడలానియుండు। బంచమియం

సీ॥భూతత్త్వమునరతుల్ పొసగ జేసినగల్గు దీర్ఘాయు
వై బిడ్డతేజరిల్లును । జలతత్త్వమునరతుల్ దెల్పినవారికిపూ
ర్ణాయువగుబిడ్డపుట్టునిలను । వహ్నితత్త్వంబునవైపు
గారతిసల్ప మధ్యాంశమై బిడ్డమహినిబుట్టు । వాయుత
త్త్వంబునవాయిగారతిసల్ప కాలకనిష్ఠమై కలుగుశిశువు।
గగనతత్త్వంబునమరతిగలుగశిశువు । క్షీణమగువాయు
వునజెందిఖిన్నిబరగు । చంద్రనాడినిరతులనుసలుపరా
దు । సూర్యనాడినిరతులకుజొరగవలయు॥ ౫౪

గీ॥సంగమంబుజూడసతిపతితత్త్వంబు । సమముగాజె
లంగసంపదలగు । నిట్లుగాకయెలతయంశములుబిడ్డ।
యర్థామగునునాయునాసుగుననఁ॥ ౫౫

సీ ॥ ఉదయ కాలమునందు నుదయించు శిశువుతానా
త్వికుండై యొప్పు సరసముగను । మధ్యాహ్నమునను జ
న్మమునొందుశిశువుతాదుష్టవర్తనములధూర్తుడగును। అ
స్తమానంబునందావిర్భవించిన నసురరూపుండగు నవని
యందు। రాతిరిసరిప్రొద్దురంగుగామరిబుట్టసకలసామ్రా
జ్యములస్వరసినొందు । వేకువనుజన్మమొందినప్రాకటముగ।
దీర్ఘ తరమై నయాయువుదిట్టముగను।మట్టుమీఱగభువిగ
ల్గుమర్మములను తెలియజెప్పదవినుమింక తేటపడగ॥ ౫౬

సీ॥అయిదవనెలపనరన్నంబుతల్లికితాతిశిశువుపైత్య
దేహియగును।నారవనెలనాఘ్లసారంబుభుజియింపశ్లేష్మదే
హుండగుజెల్వమమర । నేడవనెలదల్లిహిమ్ముగారధిగ్రో
లమర్చలదేహాయుధూర్తుడగును । నష్టమమాసమందా
హారోసతిపతుల్గూడినవీర్యంబుగుకదిశిశువు । పొపకరు.౦

దునయివాడుబరగునిలను । పొందుగామాసనవకముంనం
దురతుల । గూడియుండినపిండంబుగూలిపడును । నిందు
కెంతయుసంశయంబెంచవలదు॥ ౫౭

అనినపార్వతియిట్లనియె॥

క॥ పదారికమగు మాసములు వా । రేవారకయ నుభవింతురి
ట్లుండంగా । భూవినుత జననిదురితం । బేవిధిదనయున
కుగలుగు నెరిగింపుపతీ॥ ౫౮

అనిన నీశ్వరుండిట్లనియె.

శ్లో॥ మాతృకర్మంచపుత్రస్యపుత్రకర్మంచమాతృకాః।
సంచవష్ట సమాప్రోక్తంతదంతెఱురువానితమ్॥

వ॥ అనువచనంబుగలదనిన పార్వతి పరమేశ్వరుని
జూచియిట్లనియె నోదేవాతల్లిగర్భంబున బిండం బెవ్విధం
బునుద్భవించియుండు దమయంశంబైన పంచభూతంబు
లవలన బంచదేహంబు లెట్లేర్పడియున్నవి పరబ్రహ్మస్వ
రూపంబయు తామేప్రకారంబుగా నిలిచియుండు రందు
స్థూలసూక్ష్మకారణంబు లేవిధంబుసజరించునివినవిస్తరం
బుగా దెలియనానతిమ్మనిననీశ్వరుండిట్లనియె॥ ౫౯

గీ॥ సప్తధాతువులనుసకలజనంబులు । వృద్ధిబొం
దునట్టివివరమెల్ల । లోకములనుగల్గులోరహస్యములను।
దెలియజేతువినుముతెల్లమిగను॥ ౬౦

సీ॥ సతిపతిన్యాయంబు సల్పినరాత్రిని ఉంతపండు
పెరుగు జేరుభంగి । పంచరాత్రులలోనబరగబుద్బుదమా
నుబిండంబుపడెనపేర్మిబాల్చు । మాసంబులోపలమరి
శిరంబేర్పడు నిరుమాసములబాహులిరవుబాల్చు । మూ

డుమాసములందు ముదముతోనుదరంబు నాల్గుమాసము లందునమరుపదము। లయిదుమాసంబులందుననవయవంబు। నారుమాసంబులందులనమరునాళ్లు। సప్తమాసంబులోజీవసరణిజెందు।నష్టనవములయందవస్థాప్తిఁబొందు॥

గీ॥ అంతకంతకునప్పిండమమరివృద్ధి। బొందుచుండునుగోరికల్ భుక్తితల్లి। తిన్నసారంబులవిదాను తినగమరిగి। యూర్ధ్వముఖముగబిండంబునుండులలన॥ ౭౨

గీ॥ నవయవంబులమరునవమాసములయందు। నవబిలంబులొందునయముగాను। పూర్వపరువుమరిచిభువినధోముఖమున। నూహగల్గితానునూడిపడును॥ ౭౩

అనిపరియునిట్లనియె.

శ్లో॥సద్యోజాతాతథాభూమివామదేవోద్భవంజలం। అఘోరవహ్నిసంజాతంవాయుతత్పురుషోద్భవం॥ ఈశాన్యగగనంజాతంపంచభూతమయంజగత్॥ ౭౪

వ॥ ఓలలనా పంచముఖంబులయందుపంచభూతంబులుద్భవించెనదియెట్లన్న నాకాశంబునందువాయువుబుట్టె వాయువునందగ్నిబుట్టె యగ్నియందు జలంబు బుట్టె జలమునుపృథివిబుట్టె యీచెప్పినపంచభూతంబులేర్పడి రెండేసిభాగంబులొంది భాగంబునాల్గేసి యంశంబులయితన నిజాంశంబును గూడి యొక్కొకటియయి దేసితత్వంబులయి వెరసి యిరువదియయిదు తత్వంబులుగూడి స్థూలసూక్ష్మకారణంబులయ్యె నదియెట్లన్న మాంసశల్యత్వగ్రోమనాడు లయిదును పృథివియందుద్భవించె మలమూత్రస్వేదశుక్లశోణితంబు లయిదును జలంబునందుద్భ

వించె క్షుత్పిపాసా నిద్రాలస్యాద్యంగములు లయిదును నగ్నియందుద్భవించె లేచుట కదలుట చిక్కుటముడుచుట సాచుటయును నయిదును వాయువందుద్భవించె రాగద్వేషభయలజ్జామోహంబులను నయిదు నాకాశంబునను ద్భవించె నీచొప్పున ప్రథమార్ణంబున స్థూలంబు నేర్పరచి యందు రెండవసాధనంబు జ్ఞానేంద్రియ మనోబుద్ధిచిత్తాహంకారంబు లీపంచకం బాకాశమందుద్భవించె ప్రాణాపానోదాన వ్యాన సమానంబులను నయిదును వాయువందుద్భవించె. శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబులైదును నగ్నియందుద్భవించె శబ్దస్పర్శరూపరసగంధంబులైదును జలమందుద్భవించె వాక్పాణిపాదపాయూపస్థంబులను నయిదును పృథివియందుద్భవించె నిట్లు రెండవసాధనంబు సూక్ష్మంబుగ నేర్పడియుండు నింద్రియములు మూడవసాధనంబు పృథివీయంబు గంధేంద్రియంబు ఘ్రాణేంద్రియంబు ప్రాణేంద్రియంబు నహంకారేంద్రియంబు నీపంచకంబు పృథివ్యంశంబగు నుపస్థేంద్రియంబు నపానేంద్రియంబు జిహ్వేంద్రియంబు రసనేంద్రియంబు గుహ్యేంద్రియంబు నీపంచకంబును జలాంశం బగు బుద్ధీంద్రియంబు దానేంద్రియంబు రూపేంద్రియంబు పాదేంద్రియంబు నేత్రేంద్రియంబు యీపంచకమును నగ్నియంశంబయ్యె పాణీంద్రియంబు స్పర్శేంద్రియంబు త్వగింద్రియంబు వ్యానేంద్రియంబు మనసేంద్రియంబు నీపంచకమును వాయువంశంబగు జ్ఞానేంద్రియంబు సమానేంద్రియంబు శ్రోత్రేంద్రియంబు శబ్దేంద్రియంబు వాగింద్రియంబు నీపం

చరమును నాకాశాంశంబయ్యె నిట్లుపంచతత్వంబులు నే ర్పడిపంచభూతాంశంబులంజెంది స్థూలదేహంబయ్యెనంను నూత్న్యంబు ప్రాణో పానో దాన వ్యాన సమానంబులు దశేంద్రియంబులు మనోబుద్ధులుగూడి యీపదియేడును లింగ దేహంబయ్యె నందుకారణంబు చిత్తాహంకారతన్మా త్రలుజీవునికారణశరీరంబయ్యెవినుము॥ ౬౫

గీ॥ వరుసతోడతత్వపంచకమార్యంతము। వినుము సెప్పెదనువివేకనిలయ। మనసుసంశయంబుమడిఁగోచ నియ్యక। తెలుసుకొనుముదీనితెల్లమిగను॥ ౬౬

సీ॥ఎఱుపువర్ణంబునవెనసినవృథివియునై ఖరీనాదం బువలనమీఱి। యుండునకారంబునురువందిబీజంబునధి పతిగాబ్రహ్మయందునుండు.। హంకారమనువృత్తియందు స్థముననర్ధపరిమాణముననొందిప్రజ్వరిల్లి। పెనగుత్రికూ టాదిపీఠంబుననుగ్రియాశక్తితోమఱికూడిసిద్ధిజెందీ। రూ పరేఖాదిమానంబురూఢులెల్ల। గలిగివర్తింపులనువునేకా లమందు। బరగుచుండునుమిక్కిలిబలముగాను। పృథ్వి తత్వమివ్విధమునవృద్ధినొందె॥ ౬౭

సీ॥తెల్లనికూపుతోడేజరిల్లుచునప్పుతత్వంబువెలసెను ధరణియందు। మధ్యనాదముతోడమరులుచుండుఉకార మనియొకిబీజంబునందునుండు। దివ్యపీఠంబునదిట్టంబుగా విష్ణువధిదేతయునగునద్భుతముగ। జిత్తంబుతనవృత్తిజె లగునంగుష్ఠంబుపరిమాణమునజాలబ్రబలెజ్ఞాన। శక్తితో గూడియిట్లుప్రసిద్ధిజెందె। యొరవుమీరిచెలంగెను నొడల

యందు । కలసివర్తించెనుదకవుకారణంబు । దెలియజె
ప్పితివినుమీవుతెల్లమిగను॥ ౯౮

సీ॥సల్లనిరూపుతోనయముగామఱవహ్ని తత్వంబు
లసెనత్యంతమునను । పశ్యంతినాదంబుపరగరకారంబున
నుబీజమచ్చటనమరియుండు । కొల్లాటపీఠంబుకొలిచి
యుండునుగ్రుడదధిదేవతయునయియమరిబుద్ధి । వరుస
నరాంగుష్ఠపరిమాణ మొప్ప గాగలిగియుండును చాలఘన
తనిచ్ఛ । శక్తిచేతనుతనవునజలన మొంది । ప్రజ్వరిల్లెను
వహ్నియపద్ధతిట్లు । గలిగియున్నట్టిమాగణంబుగినుము
తెన్స । బాగుగానదిపొందుడును బారునవియు॥ ౯౯

సీ॥ధూమ్రమవర్ణమునొందిదోర్బలంబునవాయువృద్ధ్వి
వించెమిగులనొప్పగాను । నందుపగానాదమభ్యసించియ
కారబీజంబుగలిగియు బెట్టుగాను । కలయగాధపీఠంబుగలి
గియుండునుమరియీశుండధిపతియయి మెనయునందు। మ
నుముతోగూడియుమానంబుగల్గిపాదాంగుష్ఠమునునుండిరం
గెసంగు । తనకునయిచ్ఛాదిశక్తియాధార మొంది । తేజము
నవాయుతత్త్వంబుదిట్టముగను । మట్టుగాజీవులందునమ
రలనిట్లు । నెగడి చెలగునుతనయొక్కనిర్ణయమున॥ ౭౦

సీ॥పీతవర్ణముతోడబ్రియముగానాకాశ మెనసెదివ్య
వునాదమింపుతోను । మకారబీజంబు మహానియ్యాపద
వితోబ్రహ్మరంధ్రముపీఠబలముగాను । నందునసదాశివుం
డమరియధిపతిగానుండిపాలనజ్ఞాన మొప్పతోడ । నను
రూపమానంబునమరికనొందిశాచలన మొందునుపరాశక్తి
తోడ । నిట్టిమానంబు చేతదానిహామునందు। బూనివర్తిం

చుమేనులపూర్ణముగను । శక్తిగగ్నియుగగనంబు జెలగు
నిగుల । వేళవాళలుపాటించి వెలుగుచుండు॥ ౭౧

వ॥ ఇట్టిపంచతత్వంబులునాశ్రయించి వాక్పాణిపాద
పాయూపస్థలు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబులనద
శేంద్రియంబులుబొడగను తద్వివరంబు॥ ౭౨

గీ॥ వాక్కునందుసమరివహ్నిమీరగనాగ। భూతముం
డిపల్కుబొంకముగను। పల్కుపల్కులెల్లబరిశీలనముచే
య। వాణియధిపతిత్వవర్ణనమున॥ ౭౩

గీ॥ కరతలంబులందుగాంచితోమహితమూర్తి। వాయుభూ
తమంమపరికృతంబు। గాగనుండి జేయుగలకర్మములువే
ను। జేయనధిపుడింద్రుడొప్పియుండు॥ ౭౪

క॥ పాదములగ్నిభూరభూతము। పాదుగనుండియు
నుమిగులబటువుచలనముల। మేదినిగమనాగమనము। భే
దించుటకొఱకువిష్ణుపెద్దగనుండు॥ ౭౫

గీ॥ పాయునందుమిగులపరగధనంజయు। భూతముం
డిశబ్దమునుఘటించు। నందువిషయములకునధిదేవమిత్రు
డు। పాలనంబుజేయపడతివినుము॥ ౭౬

గీ॥ దేవదత్తమొనిసితేటగాగుహ్యము। నందుజేరివిష
యమొందజేయు। నందుగద్దెమిగులనానందములుపొం
ద। బ్రహ్మయధిపతియుగబరగెనందు॥ ౭౭

గీ॥ కర్ణయుగమునందుగాంచితోనాకాశ। భూతముం
డిరవముబొసగజేయు। నందునధిపతిత్వమమరిదిక్కుల
నుండి। పాలనంబుజేయుపరగవినుము॥ ౭౮

క॥ చక్కగద్వగింద్రియంబున। మక్కువలోదనగి

యుండుమూరుగభూతం । బె క్కొడలజేయుస్పర్శము । జి
క్కొయుపరిపాలనంబుజేయునుశశియుఁ॥ ౭౯

గీ॥ చక్షులందుమిగులచనువుకేమరియగ్ని । భూత
ముండిరూపుబొసగపరచు । నందుసూర్యుడుండియధిపతి
గాపర్గ । భేదములుసజేయుబ్రియముగాను॥ ౮౦

గీ॥జిహ్వాయందునమిక్కిలిజెలగనప్పు । భూతముండి
యురసములుబుట్టజేయు । నదియుభేదింపనెప్పుడునయ
ముగాను । వరుణుడధికారియైయుండువన్నెమీరి॥ ౮౧

క॥ఘ్రాణేంద్రియమునసెప్పుడు । క్షోణీభూతంబుగ
లిగిసురభిగ్రహణా । క్షీణతనశ్వినులధిపతులై నెగడగనొ
ప్పుదుచంద్రునద్రితనూణా॥ ౮౨

వ॥ఇట్టిదశేంద్రియంబులబ్రావుగొని ఇడాపింగళ సు
షుమ్న గంధారి అస్తిని పూషా యశ్విని శంఖిణి అలంబి
కగిహ్వాన దశనాడులేర్పడుతద్వివరంబు॥ ౮౩

సీ॥నాసికామధ్యనివాసినై సుషుమ్నందు ప్రియముగాను
డియుండుపింగళుండు । నెడమయందిడయునునింపుగామ
రియుండుగంధారికుడికన్నుగలసియుండు । నస్తినివాలు
కనమునకలోనుండు యుడమకన్నునుబారియనసియుండు ।
నుడిచెవినూహాయునుకుడుగామరియుండు నెడమనైయ
శ్వినియొనసియుండు । శంఖినిబొడ్డునజెల్వుమీరుచునుండు
గుంహ్యమంగాలంబుకూడియుండు । గుదమునందులనూ
హాముకుడుగాగ । నుండునతతంబునీలాగునొడలియం
దు । మరలుచున్నట్టిదశనాళ్లమర్మమిదియు । దెలియ
జెప్పితివినుమీవుతెలివిమీర॥ ౮౪

వ॥ ఇట్టిదశనాడులయాధారంబున బ్రాణా పానో దానవ్యాన సమాన నాగ కూర్మ కృకర దేవదత్త దనంజ యలన దశవాయువులుచరింపుచున్నలనంబు॥ ౮౫

ఉ॥మానుగనాసికంబుననుమట్టుగప్రాణమునయ్యపా నముం। బూనికతోగుదమ్మునను బొల్చిమలంబునుద్రో యుచుండునా। వ్యానముసర్వసంధులనువారకబాలుచు నాభిమెచ్చమే। లూనియుదానముంగళమునొందిక హించునుగీతశబ్దముల్॥ ౮౬

క॥ ఒప్పుగదేహములోపల। మెప్పుగసర్వంబునందు మెలగిసమానం। బెప్పటిరసములనప్పుడు। నుప్పునదేహ మునునన్నకూర్చునుకడిమిన్॥ ౮౭

సీ॥ నాగవాయువుబాలనయముగాతనువునగలసికో మంబులుగదలజేయు। కూర్మంబుకన్నులనుదురుగావర నిల్చిచూపులునీక్ష లనవ్యాపకమగు। కృకరంబు నాసికాగ్ర హామునందుననిల్చిగంధదుగంధముల్ గ్రహణపఱుచు। దేవదత్తముపరిదేటగాగుదమున చలనగ్రుంథులుతానుజ రువుచుండు। ధాలమునధనంజయమును పాదుకొనియు। నుండిసతతంబుఘోషతోనొప్పుచుండు।కర్ణరంధ్రంబులం దునగలుగుఘోష।మరణమందుననాఘోషమానువినము॥

శ్లో॥ఇంద్రనీలప్రాణవాయురపానోహారితస్తథా। ఉ దానంచరక్తవర్ణంవ్యానంగోక్షీరవర్ణకం। నీలవర్ణంస మానంచపీతవర్ణంచనాగకం। కూర్మవాయుశ్వేతవర్ణ మంజనంకృకరస్తథా। దేవదత్తస్ఫటికంచ యింద్రనీల ధనంజయా॥ ౮౯

వ॥ ఇట్టిదశవాయువులవలనక్రియాశక్తి జ్ఞానశక్తి యాదిశక్తి ఇచ్ఛాశక్తిపరాశక్తులన పంచశక్తులు ప్రభవంబొందెతన్నిర్ణయంబెట్టిదనిన॥ ౯౦

క॥ కర్మేంద్రియములయందున। కర్మక్రియాశక్తినిల్చిక్రమమునవెవుడుఁ। గర్మంబులునెరవేర్చును। నిర్మలముగభువినినదియునిజపతితోడఁ॥ ౯౧

క॥ జ్ఞానేంద్రియములయందును। మానుగనాజ్ఞానశక్తిమరియుమరికలో। బూనిఫలవృద్ధికరములు। దానవెమరిజేయుచుండుధరలోవినుమా॥ ౯౨

గీ॥ ఆదిశక్తియొక్కయాధారమునుబట్టి। ప్రాణపంచకములుబాంధవియు। దేహమందుమిగులదేజరిల్లుచునుండి। దిరుగుచుండునెప్పుడుదిట్టముగను॥ ౯౩

గీ॥ పంచభూతములనుపరగనిచ్ఛాశక్తి। ప్రాపుజెందిమిగులప్రబలమొంది। నామరూపములనుబ్రామిశ్రేష్ఠముగాను। దేహమందుదిరుగుతేటగాను॥ ౯౪

గీ॥ సరవినెల్లప్పుడునుపరాశక్తితోడ। శూశిమనసాదికరణములగొప్పగాను। చలనమొందునుపరిపరిచాలలోలసి। యట్టియందునదరగలాహ్లాదభంగి॥ ౯౫

వ॥మరియునంతఃకరణనిర్ణయంబువినుము॥

ఉ। కారణపంచతత్త్వములు కాంతిగమీరె జనాదులందహం। కారముపృథ్వియయ్యనిలగగ్గెనుచిత్తమునప్పునయ్యెతా। బారెనువహ్నిబుద్ధియయిబట్టుగవాతముమానసంబునై। గారవ మొప్ప నంబరము గట్టిగ జ్ఞానమునవ్యాపించెరా। ౯౬

వ॥ ఇట్టియంతఃకరణంబుల ప్రాపుగొని - రాజస-తామస - సాత్వికంబులను - త్రివిధగుణంబులు వేర్పడె దత్క్రమంబెట్టిదనిన॥ ౯౭

ఉ॥ కారణరక్తవర్ణమటు గౌరవవృత్తియు క్రూరబుద్ధ్యహం। కారముడంబమత్సరము గర్వములక్రమమాదిగా వెరా। జారతనంబులుఁ మరియుఁ జక్కని కాంతలగోరు వాంఛలఁ। గారవమొప్పగా భువినిగట్టిగ రాజసచర్యలివ్వియా॥ ౯౮

ఉ॥ మెలుగకప్పువర్ణమును మెచ్చుగ మోహమునెచ్చునిద్రయుఁ। జాలగనన్యబాధలను సల్పుటపాపపుచింతమిక్కిలిఁ। వాలుగదివ్యసౌఖ్య మొకవాసనమూర్ఖముబుద్ధిహీనమి। శీలము లెల్లతామసపు చేష్టలుగామరి యొప్పభామినీ॥ ౯౯

ఉ॥ తెల్లనిరూపుతో మిగుల తెంపుగ సత్యము జ్ఞానమానములే। చల్లని దానధర్మములు సల్పుటయుత్సవనిశ్చయంబులుఁ। మెల్లతపంబు ధైర్యమునుమించుగశాస్త్రములందు భక్తియు। నెల్లసమన్వితంబుగను నిల్పగుసత్వగుణంపుచర్యలుఁ॥ ౧౦౦

వ॥ ఇట్టి త్రిగుణభావికంబునాశ్రయించి-జాగ్రత్స్వప్న సుషుప్తి- తుర్య- తుర్యాతీతంబులయిన పంచావస్థల జెందిజీవుండు చెలంగుతత్ప్రభావం బెట్టిదంపుము॥ ౧౦౧

వ॥ మఱియు జీవుండు విశ్వతైజస ప్రాజ్ఞులని- జీవిత్రిభావంబునొంది భ్రూమధ్యమందు శబ్దస్పర్శరూపరసగంధంబులయినను వచనవానసమానస విసర్జనానందము

లయిదును మనోబుద్ధిచిత్తాహంకారంబు నాల్గును వెరసి పమనాలుగుతో జీవుడు పరమాత్మస్వరూపుండయి జాగ్రతాభిముఖంబున విశ్వుండను పేరవిషయంబుల ననుభవించుచు నక్కడనుండియంతఃకరణంబును నాల్గింటితో కంఠస్థానంబు జేరి స్వప్నావస్థలనొంది దృశ్యాదృశ్యంబులుబొందుచు తైజసనామధేయంబు దాల్చియక్కడనుండిమఱి పూరక మనమనోబుద్ధులతో జేరి సుషుప్త్యవస్థంజెంది ప్రాజ్ఞరూపంబుదాల్చియటమీదినివర్తనంబులుబొందుచు నక్కడనుండి మనమనొనీయంబుతోగూడి స్వాధిష్ఠంబున జేరి తుర్యావస్థనొంది యుచ్ఛ్వాసనిశ్వాసంబులధికంబుగా బొందుచు నిరుపమ నిర్గుణ నిరామయ స్వరూపంబున నిర్వాణపదంబును జెంది మూలాధారంబునవచ్చినిలుచును నవస్తతుర్యాతీతంబున జెంది తాను నేననుభావంబున నతీతమార్గంబునత దాక్రమంబుగా నతతంబు దిరిగి యాజీవుండు స్థూలసూక్ష్మ కారణ మహాకారణ విరాటుహిరణ్యగర్భ అవ్యాకృత ప్రకృతిమూలప్రకృతులనియెడి యష్టదేహంబు లెత్తి చరియించుచుండు నంతవినుము॥ ౧౦౨

గీ॥ అష్టతనువులొక్కయంశాదిరూపము। ల్నిష్టవర్ణములును లెస్సగాను। తెలియజెప్పెదవినుతేటగామరినీకు। కరణములకునింపుగానులలన॥ ౧౦౩

ఉ॥ మానుగస్థూలదేహమునుమట్టుగనెఱ్ఱనిరూపుతోడు తగా।బూనిరజోగుణంబుననుబొందగవిశ్వుడునందధీశుడై। దానకవస్థజాగ్రతయుదాల్చునకారముమాతృకై యథాస్థానము నేత్రముల్ సువిహితంబుగనై చలియించుమిక్కిలిగ॥

ఉ॥ దీర్ఘతమైననూక్ష్మమగు దేహమునెత్తియు శ్వేత
రూపతన్ । గౌరవమొప్పసత్త్వగుణ ఘట్టనదై జనదేవత
య్యనిం । పారగస్వప్నవృత్తియునుపట్టునుకారముమా
త్రకయ్యెతా । నేరుపుతోడఁగంఠముననిల్చిరహించుసుని
ర్మలంబుగన్॥ ౧౦౫

చ॥ వరముగరక్తవర్ణమునవతిఁలికాగణదేహమె
త్తినన్ । బరగుతమోగుణంబునను బట్టుగప్రాజ్ఞుడునందు
దేవతై । తరుచునవస్థసుప్తియును దాల్చుమకారము
మాత్రకై మరిన్ । మరలకయుండుహృత్కమలమధ్యము
వాసముగాగదీప్తితోన్॥ ౧౦౬

సీ॥ నీలవర్ణముననూనికమహాకారణ తనువునిర్మల
ముగదాల్చిమరియు । నందుశుద్ధంబయియమరిసాత్త్వికము
ను గుణముగల్గిరహించుతురీయగాను । సౌరిదితుర్యావస్థ
శుద్ధజీవుండందు సధిపతిగాజాలయమరియుండు । నిరత
మోంకారంబు నిలుచుమాత్రకయయి పటుతరంబుగనూ
ర్ధ్వపదమునందు । బూనివసించుచున్నది పూర్ణముగ
ను । కార్యత్వంపదభాపంబుగనుము లెస్స । సకలజనులం
దునీలాగుసఫలమొంది । తనువులునునాల్గుదీప్తితోదాల్చ
వినుము॥ ౧౦౭

ఉ॥ వాసిగబీతవర్ణమున పన్నియమీరెవిరాటు
దేహముఁ । దాసిచెలంగెరాజసము దాంకృతితోడను
బ్రహ్మమోహుడై । భాసిలుశంకితంబచటబట్టుగబుట్టువవ
స్థదానికిన్ । గానైనకార మాత్రకయు గల్గెనివాసము
నూర్ధ్వమధ్యముగ॥ ౧౦౮

చ ॥ కపవడి తెల్పు వర్ణమున గాంతిహిరణ్య వృదేహ మొత్తిన । గ్గ్రథముగ సాత్త్వికాకృతియు దిట్టముగా మరి విష్ణుదేవుడై । నడువడి తత్పతంబచట నమ్మి యవస్థయునుం డిసంపుకా । రడ జనుమాతృకయి నిలుచు రంగుగ చంద్రుని మండలంబునన్॥ ౧౦౯

సీ ॥ శ్యామలవర్ణంబు సరణిజెందుచు మరియవ్యాకృతము దేహమవతరించె । తామసగుణ మొక్క తలపహంకారంబునధిపతిగా రుద్రుడమరియుండె । నదిప్రళయావస్థయచ్చోటనమరికమలసి మకారంబుమాతృకయ్యె । సరసంబుగా వహ్నిసరవిస్థానంబు నగరిమమీరగనుండుగాంతితోడ । దరుచుగానుండు నీమూడు తనువులందు । రూఢిగా మరిజీవేశ్వరుండు మాయ । తత్పదంబును నీరీతి దాల్చె నిలను । బరగుచుండును జనులలో పద్ధతులను॥ ౧౧౦

ఉ ॥ వాలుగ నీలముల్ స్ఫటికవర్ణము ప్రాకృతిమూలదేహముల్ । మేలుగ శుద్ధసత్త్వగుణమేదురమై నస్వరాట్టధీశుడై । పాలన జేయు మిక్కిలినిబట్టుగ నాదము మాతృకై మరి న్లాలితసర్వసాక్షియగు నందునవస్థయు చన్ద్రస్థానముల్

క ॥ అష్టాంగంబులయందున । శ్రేష్ఠవుతటు ప్రజ్యోతి జెలగు ద్యుమణులన్ । సృష్టింపజేయు జలమును । నిష్ఠముగా త్రిపుటియందు నివసించితగన్॥ ౧౧౨

గీ ॥ అసిపదంబు నిధియునపరోక్షపదమిది । కూటతలమునందు గూడియుండు । నాటపాటలాడు నమరికై శీకమధ్య । నూక్ష్మదుగుచు వెలగునూటిగాను॥ ౧౧౩

వ || ఇట్టియష్టతనువులం బ్రాపుకొని పూర్వదళంబున నాగ్నేయదళంబున యామ్యాదళంబున నైఋతిదళంబున పశ్చిమదళంబున వాయుదళంబున నుత్తరదళంబున నీశాన్యదళంబున నష్టదళంబులంబులందాత్మ సంచారంబు సేయు తద్వివరంబు వినుము|| ౧౧౪

గీ || అష్టదళములందు నాత్మ వసింపగా | బావనంబు మిగులబరగునిలను | నిష్టభోగములను నింపుగా మరిదల్చి యనుభవంబు గోరు ననుదినంబు|| ౧౧౫

ఉ || పూర్వదళంబునందు మరి బొందుగ నాత్మ వసించియుండగా | నుర్విని పుణ్యనీతులును నొప్పుగ జేతురు నగ్నికోణనన్ | జేర్వగ నాత్మ నింపుగను జెందును నిద్రను యామ్యపత్రమున్ | దూర్వ వసింపయాత్మయును దుష్టతనంబును జేయునప్పుడున్|| ౧౧౬

ఉ|| మేలుగ నైఋతిదళము మీదుగ నాత్మ వసించియుండియున్| జాలగ బాపచింతలను సల్పును పశ్చిమపత్రమందునన్| వాలుగ నాత్మ జేరిననువందనమందిగ గోరు క్రీడలన్| జాలుగ జేయబూను మరి జక్కగ లోకులు లోకమందునన్||

చ|| విమలత వాయుపత్రమున వేడుక నాత్మ చరించినప్పుడే| గమనము గోరు మిక్కిలి సిగట్టిగ నుత్తరపత్రమందు దా|న మరిన యాత్మ సంతసమునందును గంబును నీశుపత్రమున్| స్థిమితమునైన యాత్మ మరిదెంపుగ ధర్మమునొనర్ప దల్చునో||

గీ|| పటుతరంబుగ నాత్మ యు బ్రజ్వరిల్లి| గర్ణపత్రమునన రులందు గదిసి మిగుల| మాయ మమకారములు దోపిములుపుచుండు| దీనిగన నేర్చువారె పోధీకులిలన|| ౧౧౯

వ॥ మఱియునష్టదళంబులప్రాపుగొని షట్చక్రముల
యందాత్మసంచారంబుజేయుతత్క్రమంబెట్లన్నను॥

క॥ ఇటచక్రషట్కమందున। బటువుగనామనసుగూ
డబాఱినయపుడే। మటుమాయలభ్రమగప్పును। కుటిల
పువాంఛలనుగూర్చి గోరుననెపుడున్॥ ౧౨౧

సీ॥ వెలువ్వమీఱుచుబ్రుథ్వీచక్రమందుమనస్సునిల్వన
లంకారనియతిగోరు। నప్పుచక్రమునందుసరిగున్నమన
సుతా సకలసౌఖ్యములొక్క సమముగోరు। నగ్నిచక్ర
మునం[illegible] నసుతా కామాదిగసములగాంచగో
రు। [illegible]చక్ర[illegible]ందువసియించి మనసుతా రంగుగా
మరిపో[illegible]గోరు। గగనచక్రంబునమనసుగగ్గియున్న।
నష్టభో[illegible]గో[illegible] నవనియందు। నటయహంకారచ
క్రంబు[illegible]న. నిల్చియు డినమోహంబునిర్వహించు॥

గీ॥ ఉప్పో[illegible]సచక్ర బుని పుగాను। మనుజులందు
నమిక్క[illegible] లచు[illegible] డీనిగనిపెట్టి రేనియుదిట్టముగ
ను। పెద్ద[illegible]నవచ్చువారినిబ్రియముగాన॥ ౧౨౩

వ॥ మఱియునన్నమయకోశంబున స్థూలదేహంబ
య్యె నందుగలయింద్రియంబులే ప్రాణమయకోశంబయ్యె
నందుగలయంతఃకరణంబులే మనోమయ కోశంబయ్యె.
నందుగలబుద్ధివృత్తులేజ్ఞానమయకోశంబయ్యె. నాజ్ఞానం
బుచేతభావంబరసి యానందించు నదియానందమయకో
శంబయ్యె నీపంచకోశంబులు ప్రాపుగొని పంచక్లేశంబులే
ర్పడితేమ నవియెట్లన్నచిద్రూపుడై తన్నుమఱచియానంద
సుఖస్వరూపంబుసాక్షియై నహోఱుకమఱచి నేనుజీవుడ

నుసంసారినియనునజ్ఞానంబయ విద్యాక్లేశంబు అట్టియ
జ్ఞానంబునొంది సంసారంబునువిడువనేరనిదేయభినివేశ
క్లేశంబు ఆసంసారంబునసక్తుండై యర్థాపేక్షచేతమత్స
రగ్రస్తుండై యుండునదియరాగక్లేశంబు తనయుదరపో
షణంబుకొఱకు నొకరినియాచించి యివ్వకున్న ద్వేషించు
టయే ద్వేషక్లేశంబు ఈపంచక్లేశంబులు సకలప్రాణులం
దు వ్యాపకంబై యుండి వీనిగూడిజీవత్రయంబునొందితా
పత్రయంబులందగిలి గుణత్రయంబులందిరిగి మలత్రయం
బులంబొరలి యీషణత్రయంబులంగోరి వాసనాత్రయం
బులంబారి కారణత్రయంబులనమరి యిట్టులరువదియా
ఱుతత్వంబులంగూడి యఱువదియాఱంగుళంబుల పరిమా
ణంబై నవగ్రహంబులు మొదలైనసకలగ్రహతారకంబులు
నమరి పాతాళలోకంబుపదంబులయ్యె సత్యలోకంబుశిరం
బయ్యె మధ్యలోకంబుదరంబయ్యె నిమ్మానవశరీరంబు శు
క్లశోణితంబులుగూడి రోగాస్పదంబైన యీమాయాకా
యంబేర్పడితెఱవినుము॥ ౧౨౪

ఉ॥ ఇట్టిఘటంబులై త్రిభవమింపుగ మోహమునొందిమి
క్కిలిన్। మట్టుగనాల్గుయోనులనుమర్లుచునుండునవేకరూ
ఫులన్। గట్టడచేతనెవ్వరునుగ్రమ్మరకర్మఫలంబుబొంది
యున్। బుట్టుదుమన్దువారలిలబ్రహ్మ్వనికుమ్మరసారెరీతిగాన్॥

చ॥ ఘనముగనంబరంబుధరగాంతిగపెక్కుఘటాదు
లందునన్। గనుపడుచుండురీతిగనుగన్నసఖకమునైనమా
గ్రమున్। దనువులనెన్నిమాత్రినను తాళిమిచేతనునాత్మసొం
గ కేప్పరివియనేకజన్మములుబట్టగనెశ్వనులోకమందునన్॥

వ॥ అనివటియు చిచ్ఛక్తిమాయోపాధులై సఘటంబున పరమాత్మ స్వరూపంబు జ్యోతిర్మయంబున నిల్వ తత్ఘటంబున విక్షేపంబులను బిలంబులు పెక్కులుండ తజ్జ్యోతిర్మయంబు బహిర్ముఖంబున ననేకంబులుగా గానవచ్చినట్లు భేదంబగుట యూయూయ శరీరంబులయందు దోపబడునట్లు గావున దద్వివరంబు పాటించు యోగంబై బరగుచునుండును మీ పార్వతీ॥ ౧౨౭

మాలినీ॥ సలలితగుణధామా శాశ్వతానందసీమా। లలితనయవిశాలా లాలితోద్భూతజాలా। కలితఘనవిభూషా కామ్యదా భక్తపోషా। జలజనయనమిత్రా చారుశృంగారగాత్రా॥ ౧౨౮

గద్య॥ ఇది శ్రీమద్విశ్వనాథకరుణాకటాక్షలబ్ధకవితాలక్షణుడౌ విశ్వకర్మపంచాననసువర్ణశ గోత్ర పవిత్ర ముండూరువంశాబ్ధిసోమ అప్పయ్యపుత్రరత్నవినుత వీరనామాత్మయోగి ప్రణీతంబైన శ్రీ పరబ్రహ్మానందబోధయను మహాప్రబంధంబునందు పరమేశ్వరుండు- పంచతత్త్వాదినిర్ణయంబులును దేహాదిక్రమంబులును భవిష్యదర్థంబులును పార్వతికి నెఱుంగించుటయు నన్నది- ప్రథమాశ్వాసము॥ ౧౨౯

---

ముల్ పొడియుఁబంటలఁ సౌఖ్యమెల్లనువృథా సంపదను
ము। పెండ్లాము బిడ్డలుఁ పేర్మైనబంధులఁ సౌఖ్యమెల్లనువృ
థా సంపదనుము। కష్టసుఖములు మిక్కిలి కలిమి లేమి। సంప
దలుగల్గ నెవరికి శాశ్వతంబు। కలసుగన్న ట్టివ ర్తనకార
ణమున। దెలియవలయును జగమును దెలిసినొంది॥ ౧౭

ఉ॥ మాయ జగంబులో జనులు పుట్టుగ జన్మమునొక్క
తావునఁ। కాయము వృద్ధిఁ బొందుటయు గష్టము జెందుట
నొక్క తావునఁ। హాయని యన్నపానములనాసలు జెం
దుట నొక్కతావునా। నాయువుదీరినంత మరియందరడం
గుట యొక్క తావగుఁ॥ ౧౮

సీ॥ కడుపడిబాడము శోకముల కెల్లను నిల్లు వ్యాధుల పుట్టు
గూడు యలతిదొడలు। మోహాతిశయములు మొలుచు మూ
లపు ముంపపాపంబులకు ప్రీతిబద్ధంబొంది। అసత్యములకు
దానను వైనపుట్టిల్లు కాలపాశము కొప్పుకరినపుమెయి। దు
ర్గంధములకును దొడ్డతొట్టియు గాను కర్మాలయంబయ్యె
గష్టతనువు। కండ తిముకలు నెత్తురు కలిగి మరియు। మూ
త్రమలములనిండిన ముడికిబంట। తోలుబొక్కసపురుగుల
తొట్టిసీని। నేను జెప్పుదు నీకు గిరీంద్రతనయ॥ ౧౯

క॥ ఎరుగక తప్పులు జేసియు। మరువుగ కాదనువు తె
న్నిరుమె మోయుచునే। ధరలోదీనియప్పుగా। బరు
వడిదేహాదలొక్క భ్రాంత్యము వినుమా॥ ౨౦

క॥ మాయిల్లని మాధనమని। కాయము తనదనుచును మ
కులకా పాడుదునఁ। మాయనిమూవారమనుచును। మా
యనుబడి మంటిపాలువనుకలగుదురా। ౨౧

పరిగ్రహింసయా । నెనసిటుయుత్తమాధమవునీతు లెరిం
గి తెలంగధమణామా॥ 33

క॥వాసిగధనధాన్యంబులు । నాసలువిడుచుండిమిగు
లనా ప్తులయందున । పాశముగోసినవారికి । నాసించ
దుకమణామేదినమ్ముముధాత్రిన॥ 34

క॥కామవికారము లెల్లను । ప్రేమాతిశయమ్ము లెల్లప్రి
యమభిమాన । వ్యామోహపాశములువిడు । నామసు
జుడుమోహికాకయాత్మవిదుండౌ॥ 35

క॥మోహంబునగ్రూరతయగు। మోహంబునద్రోహ
బుద్ధిమొనయుసుమరియున । మోహంబునసన్నుశయా।
మోహంబునిహపరాదిముఖ్యంబునగున॥ 36

గీ॥మోహరసికుండుసామ్రాజ్యముఖ్యదతడు । మో
హరసికుండుసర్వజ్ఞమూలుడతడు।మోహరసికుండుసర్వస
మ్మోదపరుడు। మోహరసికుండు దేవతామూర్తియతండు॥

క॥హింసింపుజీవుజీవిని । హింసించియు సంద్రియా
ద్యహితములకెల్లన । హింసపదలిదేహమునను । హిం
సించినవాడె మోక్షహితుఁడై పరగున॥ 37

గీ॥ఇట్లుగాక నెభువిలోన నెన్నిపాట్లు । పడ్డలౌకిక మే
గానిపరముగాదు । వేదవేదాంతవిధములవిభవమెఱిగి।
సాధుసాంగత్యములజేరసౌఖ్యమమరు॥ 38

ఉ॥ సాధుజనాదిసజ్జనులసంగతిజెందుటమూర్ఖవాది
రీన । వేదనకర్మజాలములు పీడగదిరగవచ్చునిక్కలిన।
సాధకవృత్తిజెందిపరసౌఖ్యము జెందగవచ్చుకాలికా। మే
ధరనన్నుతీసముననింపుగనీరముగల్గురీతిగన॥ 40

నాలవసాధనంబగు నీనాలవసాధనంబెట్టి వారు నెఱింగి నస్వస్వరూపులై సర్వాధికారంబు జెంది సాత్వాద్వైతస్వ రూపులై లోకంబున జెలంగుదురని మఱియునిట్లనియె॥ *

ఉ॥ మాయ జగంబు మక్కువలుమాకవియేటికినంచు సత్తుసా। పాయమునంటుదీర్చి ఘనభావికవై వపదానుకూలము గా। గాయముఖద్వను ల్వీడి చికారణమై నటు వేదవేత్తలా। న్యాయమెఱింగిసద్గురునినంటి నసద్గతి జెందిధీరుడా॥*

సీ॥ కారణత్రివిధాంశకాస్పదంబగు దేహమింద్రియములకొంకుమొదలివెల్ల। శబ్దాదిరసములు చెలగనంతఃకరణప్రాణపంచాంశసుప్రభలను। కారణపదచిత్తుకలహాంసరజుతెమోగుణముఖభ్రమలుతాగుంపులెల్ల। శపనమాదిఖ్యాతి సరణిసంసారాదివిశ్వదైవానిదివేట్కతోను। తెలసి సంకల్పములువీడ్చిధీరుడగుచు। నిల్లుగాలుచునుండంగనింటివారు। బయలుదేరుటయెట్లనోంబారియతడు। పరమగురుజేరి తెలగను తెరవువెదకు॥ ౯౭

గీ॥ మాయలోకాదిభ్రమలెల్లమరిచితాను। స్వస్వరూపోపదేశంబుసరణిజెంది। మన్నవాడగుధన్యుడునుర్వియందు। వీని వెనువెంటనే వేళనేనయుందు॥ ౯౮

గీ॥ నేనుగల్గినస్థలమందునిత్యశుభము। మిగులనానందమునుజెందినెగడుచుండు। నేనులేనట్టిస్థలమునసిరతమేద్పు రౌరవాదికనరకంబురమణివినుము॥ ౯౯

గీ॥ తెలియనటువంటిసూక్ష్మంబుతెగివిదెలిసి। పరమసుఖమాదితమలోనుప్రతిభగాంచి। దృష్టికగువస్తువనియెల్లదృశ్యమనుచు। నిర్వికల్పసమాధిలోనిగుడవలయు॥ ౧౦౦

గీ॥ ఎవ్వరెవరు మిగుల నేలీకునుండిన। వారు వారుగూడి
వక్కటైన। నాను జూడ జూడ నాత్మ యందెవ్వరు। గానరా
రు నెరుక గాకవినుము॥ ౧౦౧

గీ॥ ఎఱుకకన్న సంభ్రమే లోకమున లేదు। ఎరుక నెవరి
కెరుకయుండు నెందు। వెలయు నెరుక నెరుగ వేదాంతులకు
గాక। కతమమూఢులకును గానరాదు॥ ౧౦౨

ఉ॥ మూఢులంబులు లేపపన మొక్కటిజేసియు ఘర్మ
తామలకా। జాడలునంట కూర్చియు లజాలయునై పరసంగి
నాముడై। వేడుకతోడ భోగములు వేమరుగూడిన వారె ధన్యు
లౌ। వారె సమష్టి భావితులు వారె పరంపర యోగివర్యులౌ॥

గీ॥ యోగిమహిమలు జగతిలో నుండు నిట్లు। జెప్ప నెవరికి
మిక్కిలి శక్యమౌనె। నిందు నెందున నుండి తాసిద్ధిదయుగ
జెందియుండును వారిమేల్ చేష్టలిలను॥ ౧౦౪

వ॥ మరియు లోకంబున యమనియమాసనప్రాణా
యామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధులయిన నష్టాంగ
యోగంబు లోకనిష్ఠలు ప్రతిష్ఠించె తద్విపరంబు యమం
బున నహింసయు సత్యంబును అస్తేయంబును బ్రహ్మచ
ర్యంబును అలస్యంబును శుయంబును త్రిదియంబును ని
తాహారంబును శౌచంబును ననదశవృత్తులు బొడగన వా
రి నిశ్చయం బెట్టిదనిన త్రికరణవృత్తిగా సకలజీవహింసలు
సేయకుండగా జ్ఞానంబున నాత్మ నశించదం దెరుక నెరుగ
యహింసయనఁబడును వాస్తవ్యము నినదిరిని ప్రత్య
క్షముగా జూడబడి పలికి సర్వలోకంబు బ్రహ్మమయంబని
యొండు సత్యమనంబడును పరధనాపేక్షయు లేకుండ జ్ఞానం

బుననాత్మానాత్మయనియెంచనిదే ఆస్తేయమనంబడును
ఋతుకాలంబున స్వస్త్రీనైననుంగూడక జ్ఞానంబునతా
నే బ్రహ్మమయంబనియెంచనిదే బ్రహ్మచర్యమనంబడును
సకలజనంబులు పరమార్థంబుజెందవలయునని కోరుటేద
యయనంబడును భార్యమొదలయినవారినిశత్రువులుగా
జూచుటయే ఆరుస్వమనంబడును శత్రువులుబాధించినమ
నంబున నిశ్చేష్టితంబుగానుండుటయే క్షమయనంబడును
వేదార్థంబులుదెలిసి సంసారవిరక్తినింజెంది సుఖంబని
జ్ఞానంబునతానే బ్రహ్మంబనిదేహంబు నేనుగానన్నదే ధృ
తియనంబడును అధికంబుకొంచంబుగాక సమంబుగా భు
క్తిభుజియించుటయే మితాహారంబనంబడును దేహమును
జలంబునగడుగగా బహిశ్శౌచంబనంబడు జ్ఞానంబునస్వ
స్వరూపంబుజెందుట యంతశ్శౌచంబనంబడు నిట్టిద్విప
దంబులునెరుంగుటశౌచమనంబడును మరియునియమంబు
న తపస్సుసంతోషము ఆస్తిక్యముధ్యానము దైవపూజ
సిద్ధాంతము లజ్జ మతి జపము వ్రతము ఇట్టిదశవృత్తుల
భావంబెట్టిదనిన దేహంబుకృశింపజేయుచు నాత్మధ్యా
నంబుచేయుట తపమనంబడును సుఖదుఃఖంబులుసమంబు
గాజూచి యిహపరంబులుగోరక ఆత్మసందర్శనంబునొందు
టయే సంతోషమనంబడును శ్రుతిస్మృతివాక్యార్థంబులను
విశ్వసించుటయే ఆస్తిక్యమనంబడును వాస్తవ్యంబుగా ధ
నంబార్జించి బ్రహ్మనిష్ఠాదులకు నభ్యాగతులకునుపకృతిజే
యుటయే దానమనంబడును త్రిమూర్తులకు వర్ణత్రియత్ర
లశక్త్యనుసారముపూజించుటయే దైవపూజయనంబడు

ను వేదాంతసిద్ధాంతశ్రవణాదులు గురుముఖంబుగానివి
పించుట వేదసిద్ధాంతమనంబడు లౌకికమందును వైదిక
మందును దుర్మార్గవృత్తులకుజడుసుటయే లజ్జయనంబడు
ను వేదశాస్త్రంబులు మొదలయినపుణ్యపదంబులాలించు
టయే మతియనంబడును పాశుపదార్థవ్రతంబును శిరోవ్ర
తంబును అత్యాశ్రమవ్రతంబును వేదంబునజెప్పిన మంత్ర
పూర్వకంబునుపఠించుటయజపంబనంబడును పరబాధలు
ను పరస్త్రీనిస్పృపరధనాపేక్షయును కఠినవాక్యములును
నన్రృతంబులును వికల్పాకృతులునువిడిచి మనంబున నరిష
డ్వర్గంబుంబాసి దేహాధ్వనులు మరిచినదియవ్రతంబనంబ
డున. ఇట్లునియమంబులేర్పడి మరియునాసనంబన స్వస్తి
కము గోముఖము పద్మము వీరము ఖేచరి భద్రము ముక్తము
మయూరము కుక్కుటము సుఖంబుననదశవృత్తులతోబా
డగనె వాటినిర్ణయంబెట్టిదనిన రెండుతొడలక్రింద రెండు
పాదంబులుమడిచికూర్చుండిన స్వస్తికమనంబడును గుద
స్థానంబున రెండుమడతలుజేర్చి మండివేసికూర్చుండి రెం
డుబాటనవ్రేళ్లు రెండుహస్తంబులతోబట్టిన గోముఖమ
నంబడును రెండుతొడలమీద రెండుపాదంబులుమడిచి
కూర్చున్న పద్మమనంబడును వలపటితొడయందు వెలుప
లిపాదంబుమడిచి పురముదీర్చికూర్చున్నవీరమనంబడును
గుదస్థానంబున రెండుపాదంబులుమతముదీర్చిరెండమమో
చెయ్యి మోకాలునునిలిపి హస్తంబువిరిచి గడ్డంబుననాని
నాసికంబునజూచుట ఖేచరియనంబడును గుదస్థానంబున
రెండుపాదంబులుగామలిచి మతమువేసి రెండుపాదంబులు

రెండుహస్తంబులతోఁగదలకుండఁబట్టిన భద్రమనంబడును ఎడమకాలిమడమ గుదస్థానంబుననదిమి కుడికాలిమడమ దానిక్రిందంజేర్చికూర్చుండిన ముక్తమనంబడును రెండు మోఁకాలులుపట్టనదిమి రెండుహస్తంబులుభూమినాని కాళ్లువాది శిరస్సుయెత్తించికూర్చున్నమయూరమనంబడును గుదస్థానంబున రెండుమడమలుజేర్చి గొంతుకూర్చుండి రెండుహస్తంబులతో రెండుపాదంబులానిరొమ్మునగ్గి శిరస్సుకొంత్తించికూర్చున్న కుక్కుటమనంబడును తానుసౌఖ్యంబుజెందబడ్డటువంటి సూక్ష్మంబుగని దృఢంబుగానుండునదియేదియో అదిసుఖమనంబడును ఇట్లు ఆసనంబులేర్పడియె మరియుప్రాణాయామంబన సగర్భంబను ధ్యానంబున వాయువుబంధించుటయును అగర్భంబనధ్యానము లేకవాయువునుబంధించుటయును ఇట్టిద్విపదంబులు రేచక పూరక కుంభకంబులతోఁబ్రవర్తించుచుండు తన్నిర్ణయంబెట్టనినన రేచకమన వాయువువిడుచుట పూరకమన వాయువునెక్కించుట కుంభకమన వాయువునిల్పుట ఇట్టిక్రమంబులనెరుంగుట ప్రాణాయామంబనబడును మరియు ప్రత్యాహారంబన సర్వేంద్రియవ్యాపకత్వంబులు మనంబునంజలింపక లక్ష్యంబునిల్పి నిత్యకృత్యములు పరబ్రహ్మారాధనంబునజేర్చి యాత్మతానన్నదియేదియో అదిప్రత్యాహారమనంబడును మరియుధారణంబన తనలోనున్నపంచభూతంబులువెలి మహాపంచభూతంబులనెంచి మరిపాదములనుంచి మోఁకాలుపర్యంతము పృథివ్యంశంబున జేరి బ్రహ్మభాగంబయ్యె మోఁకాలునుంచి నాభిపర్యంతము జ

లాంశంబునం జేరి విష్ణుభాగంబయ్యె నాభినుండి వక్షస్థల
పర్యంతము నగ్న్యంశంబున జేరి రుద్రభాగంబయ్యె వక్ష
స్థలంబు మొదలుకొని భ్రూయుగపర్యంతము వాయ్వంశం
బునం జేరి యీశ్వరభాగంబయ్యె భ్రూయుగంబు మొదలు
కొని శిరస్సుపర్యంతము నాకాశాంశంబునం జేరి సదాశివ
భాగంబయ్యె మరియు మనస్సుకు చంద్రుండును శ్రోత్రంబు
లకు దిక్కులును భుజంబులకు హరియును వాక్కునకు నగ్ని
యును గుదంబునకు మృత్యువు నుపస్థంబునకు ప్రజాపతి
యును త్వక్కునకు వాయువును నేత్రంబులకు సూర్యుండు
ను జిహ్వకు వరుణుండును నాసికంబునకు భూదేవియు నని
దేవతలును తనలోనిట్లని దెలసి దేహాది ప్రపంచకంబయి
పంచభూతంబులను మహాభూతంబులం జేర్చి మహాభూతం
బులను మాయను జేర్చి యామాయ నాత్మస్వరూపంబున
జేర్చి తాను చిన్మాత్రుండయిన యెరుక నెరిగినది యద్దియో
అది పరమధారణంబనంబడును మరియు ధ్యానంబన [illegible]
సంబు తత్స్వరూపంబుగా భావించి చలనంబులుడంచి దేహాతీతం
బయిన స్వస్వరూపంబు చిన్మాత్రంబు తానే యనిభావంబు
నెరింగిన పరమధ్యానంబనంబడును మరియు సమాధియం
దున నేను దేహంబునుం గాను సాక్షాత్పరమేశ్వరుండ నైన
యని నిశ్చయించి అండపిండబ్రహ్మాండంబులను వెలిపంచభూ
తంబులం గలిపి యాభూతంబులను అపంచీకృతభూతంబుల
గలిపి వానియంశంబయిన తన్మాత్రలు మాయను గలిపి యా
మాయను ప్రత్యేకాత్మను గలిపి తానే యాత్ముండయి నేనే
బ్రహ్మంబు వేరువినా వేరొకటి లేదని తెలిసి ప్రణవస్వరూపం

బయిన పరమేశ్వరుని త్రివర్ణంబులుగా భావించి యామూ
డువర్ణంబులను ఋగ్యజుస్సామవేదంబులని భావించియం
దునాదంబే యాధారంబుగా భావించి యామూడువర్ణం
బులే బ్రహ్మవిష్ణుమహేశ్వరులుగా భావించి యానాదం
బే కారణాత్మగా భావించి యామూడువర్ణంబుల మూడ
గుణాలుగా మూడులోకంబులుగా మూడవస్థలుగా మూడు
స్వరంబులుగా మూడుస్థానంబులుగా మూడుకాలంబులు
గా భావించి అకారంబు నుకారంబునం జేర్చి యుకారంబు
మకారంబునం జేర్చి మకారంబే నాదంబునం జేర్చి యానా
దంబు మాయను జేర్చి యామాయను జీవునిలో చేర్చి యా
జీవుని యీశ్వరునిలో జేర్చి యీశ్వరుని నేనే యన్నట్లుగా
భావించిన పరమసమాధి యనంబడును అనిమరి యామా
యలోకంబు మనోవికారంబుగావున మనస్త్యాగంబు
చేయవలయు తన్మనస్త్యాగంబునకు గురుసేవ కారణం
బుగ దెలియవలయు॥ ౧౦౫

అనిన బార్వతి యిట్లనియె.

క॥ గురుడనగ నెట్టివాడో। గురుతుగ మరి వాని యొక్క
గుణచర్యలు నా। కెరిగింపుము దయతో నుత। పరమేశ్వర
యతని యొక్క పద్ధతు లెల్లన్॥ ౧౦౬

అనిన యీశ్వరుం డిట్లనియె.

క॥ గురు రాజమంత్రసేవన। కరమరుదుగను త్తరింప క
రణలతులుగ। దొరిగించుము యోగంబును। బరిపక్వము గాక
వారి త్రాంతులు చనునే॥ ౧౦౭

